ఆంధ్ర ప్రదేశ్ ఉన్నత న్యాయస్థానం ఇటీవల ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టిన నిర్బంద ఆంగ్ల మాధ్యమ విద్యకు సంబంధించిన ఉత్తర్వులను కొట్టివేస్తూ, సంచలనాత్మకమైన తీర్పునిచ్చింది. విద్యా రంగంలో, వివిధ సందర్భాల్లో, వివిధ రాష్ట్రాల్లో ఉన్నత న్యాయస్థానాల్లో, దేశ సర్వోన్నత న్యాయస్థానంలో దాఖలైన వ్యాజ్యాల కన్నా ఈ తీర్పు చాలా లోతైనది, సమగ్రమైనదని చెప్పుకోవచ్చు. ఈ తీర్పులో ముఖ్యాంశాలు

1. స్వాతంత్రపూర్వ ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన ఆంగ్ల విద్యావిధానంలో లోటుపాట్లు, విశ్లేషణ.
2. స్వాతంత్రానంతర విధానాల్లో శాస్త్రీయత, మహనీయుల అభిప్రాయాలు.
3. ఏ మాధ్యమంలో చదువు శాస్త్రీయం, మాధ్యమ నిర్ణయంలో ఎన్ఈసిఆర్టి, ఎస్సిఈఆర్టి ల పాత్ర.
4. రాజ్యాంగం, విద్యాహక్కు చట్టం మరియు జాతీయ విద్యా విధానపరంగా ఈ ఉత్తర్వులు చట్ట వ్యతిరేకం.

ప్రజల్ని చైతన్యపరిచేందుకు ఇచ్చిన ఇంతటి సమగ్రమైన తీర్పును గురించిన చర్చ, ఈనాడు జరగట్లేదు అన్నది దిగమింగలేని వాస్తవం. తీర్పులోని అంతరార్థం, ఆంగ్ల మాధ్యమ విద్య ప్రాథమిక స్థాయిలో శ్రేయస్కరం కాదనే చెబుతోంది. కానీ ఇంకా రామాయణం లో పిడకల వేట చందాన తీర్పులోని న్యాయ, సాంకేతిక కారణాల లోసుగులతో నీరుగార్చే ప్రయత్నాలు జరుగుతుండటం అత్యంత బాధాకరం.

అంతా భ్రాంతియేనా??

ప్రైవేట్ పాఠశాల పిల్లల మాదిరిగా పేద వారికి, బడుగు బలహీన వర్గాలకు ఆంగ్ల మాధ్యమ విద్య అక్కర్లేదా? గొప్పింటి బిడ్డలే ఆంగ్ల మాధ్యమ విద్యకు అర్హులా? లాంటి ప్రశ్నలతో విద్యాభ్యాసానికి అసమానతల రంగు పులుముతున్నారు. ఇక్కడ గుర్తించాల్సిన అంశం, ఏ మతమైన, ఏ కులమైన, సంపన్నులైన, బీదలైన ఎవరైనా సరే, శ్రద్ధ మరియు పట్టుదలతో అభ్యసించిన వారినే విద్య వరిస్తుంది. అలాంటి విద్యను దేశమంతటా అన్ని వర్గాల వారు అందిపుచ్చుకోవాలనే, విద్యా హక్కు చట్టం, నిర్బంద ప్రాథమిక విద్యా చట్టాల్ని రూపొందించారు. విద్యను ప్రభుత్వేతర సంస్థలు అందించినపుడు కూడా నిస్వార్థ సేవగానే చేయాలనే చట్టాల్ని చేశారు. కానీ ప్రైవేట్ సంస్థలు ఆంగ్ల మాధ్యమ విద్యను ఒక వినూత్న విపణి విధానంగా మల్చుకున్నాయి. ఈ ధోరణిలోనే "కొలువుల కోసం విద్య" అన్నట్లు వారు చేసే ప్రచారం వలన, ఆంగ్ల మాధ్యమంలో చదవటం గొప్ప అన్నట్లు, ఆ విధానంలోనే ఆంగ్ల భాష అనర్గళ వాక్పటిమ వస్తుందన్నట్లు తల్లిదండ్రులు భ్రమపడుతున్నారు.

గాంధీజీ తన స్వీయ సంపాదిత హరిజన పత్రికలో, ఆంగ్ల విద్య గొప్పదన్న ఆలోచన మానసిక బానిసత్వమని, అలాంటి పోకడలకు లొంగవద్దని, మాతృభాష తల్లి పాల వంటిదని, రష్యా లాంటి దేశాలు తమ మాతృభాష మాధ్యమ విద్యలోనే

సాధించిన పురోగతిని గుర్తించాలని ప్రబోధించిన విషయాన్ని,తీర్పులో పొందుపరిచారు. నిజానికి, మెకాలే ఆంగ్ల మాధ్యమ విద్యా విధానం, తెల్లవారి సామ్రాజ్యంలో మనం సేవకులై, వారి కొలువులో గుమాస్తాగా పనిచేసే "సౌభాగ్యం" కోసం తెల్లవారు ఇచ్చిన "అవకాశం" అనేది జగమెరిగిన సత్యం. రెండు వందల సంవత్సరాల వారి పాలనలోని, ఆంగ్ల విద్యా విధానం, భారతీయ విద్యా విధానం నేర్పించే పరిశోధన కాంక్ష, తర్కం, సాంకేతిక శాస్త్ర నైపుణ్యాన్ని స్థూలంగా నష్టపరిచింది.

<u>స్థానిక భాషలో విద్యా బోధన- సాంకేతికత</u>

విద్యా విధానంలో బోధనా మాధ్యమం ప్రభువుల ఆదేశాల బట్టి కాకుండా నిపుణుల సూచనల బట్టి నిర్దేశింపబడాలి అనేది RTE చట్టం చెబుతున్న సత్యం. రాజ్యాంగం ప్రాథమిక హక్కుగా మనకు అందించిన భావ వ్యక్తీకరణ, వాక్ స్వాతంత్రంలో (అధికరణ 19) విద్యాభ్యాస మాధ్యమం అంతర్భాగం. అందుకే నిర్బంధ మాధ్యమ విధానం రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకం. ఇన్ని విషయాల్ని గమనించి, NCERT, SCERT సూచనల పైన, విద్యారంగ చట్టాల్నీ మరియు విద్యా హక్కు చట్టాన్నీ అవలంబిస్తూ నిర్ణయించాలని, ఏకపక్షంగా నిర్ణయం తీసుకోకూడదని న్యాయస్థానం ప్రభుత్వానికి గుర్తు చేసింది. పిల్లలు తమ చుట్టూ ఉన్న వారితో అమ్మ, ఆవు, చెట్టు అంటూ తొలిపలుకులు నేర్చి, బడిలో చేరితే, బడి కూడా ఆ వాతావరణానికి దగ్గరగా ఉండటం వల్ల, బడి మానకుండా, ఇష్టంగా వెళ్తూ చదువుకుంటారు. అలా కాకుండా A for Apple, B for Ball అంటూ అన్నప్రాసనకే ఆవకాయ వడ్డిస్తే పిల్లవాడికి అరగదు అన్నది శాస్త్రీయ సత్యం. యూనెస్కో వంటి అంతర్జాతీయ సంస్థలు కూడా పిల్లలకు వారి మాతృభాషలోనే విద్యనందించాలని, వాటివల్ల వారి అభ్యాస ఫలితాల్లో (learning outcomes) వృద్ధి అత్యధికంగా ఉన్నాయని సూచిస్తున్నాయి. ఎవరేమన్నా, శాస్త్రీయతకు తిలోదకాలు వదిలి, ఆంగ్లంలోనే బోధిస్తే బోధనాంశాల మూలాలు, విస్తృతిని అవగాహన చేసుకునే శక్తి కోల్పోయి సత్యనారాయణ వ్రత చందాన ఉపాధ్యాయుడు ఇంగ్లీషు మంత్రాలు పఠిస్తే విద్యార్థులు మమ అనుకుంటూపోతారు.

ఆంగ్ల భాష ప్రస్తుత ప్రపంచీకరణ నేపథ్యంలో అవశ్యకమే కానీ భాష కోసం బోధన మాధ్యమమే శరణం అనటం అశాస్త్రీయం. కొలువు కోసం ఆంగ్లం అన్న వాదన కూడా పస లేనిదే. ప్రభుత్వ రంగాల్లో ఉద్యోగాలకు స్థానిక భాషల్లోనే చదువుకుని, పరీక్షలు రాసి ఐఏఎస్, ఐపిఎస్ అధికారులైన వారు కోకొల్లలు. ప్రైవేట్ రంగంలో కూడా ఆంగ్ల భాష కన్నా విషయ పరిజ్ఞానానికే పెద్దపీట. ఆంగ్లంలో భావ వ్యక్తీకరణ కోసం ప్రభావవంతమైన, శాస్త్రీయమైన పాఠ్య ప్రణాళికలు అనేకం ఇపుడు అందుబాటులో ఉన్నాయి. జర్మని, జపాన్, దక్షిణ కొరియా, చైనా లాంటి దేశాల్లో వారి వారి మాతృభాషలోనే ఉన్నత విద్యలు అభ్యసించి కావల్సినంతవరకు మాత్రమే ఆంగ్లం నేర్చుకుంటారు. తమ సొంత భాషలోనే చదువుకోవటం వల్ల, చదువు తమది అన్న భావనతో పాటు, సృజనాత్మకత, శోధనాతత్వం వంటబట్టి వారిని శాస్త్రసాంకేతిక పరిశోధనా రంగాల్లో, ఆంగ్ల అగ్ర రాజ్యాలకు ధీటుగా నిలబెట్టాయి. అమెరికా గణాంకాల ప్రకారం కూడా, గత 10 సంవత్సరాల కాలంలో చైనా

విద్యార్థులే అధికంగా ఉన్నత చదువుల కోసం వలస వెళ్లారు, మనం రెండవ స్థానంలో ఉన్నాం. అందువల్ల విదేశీ ఉన్నత చదువుల కోసం, ఉద్యోగాల పోటీ పరీక్షలకు కూడా స్థానిక భాష మాధ్యమం అడ్డుగోడ అవ్వదని ఘంటాపథంగా చెప్పవచ్చు.

ప్రభుత్వ కర్తవ్యం

విద్యా బోధన, విద్యా సముపార్జనకే ప్రాధాన్యతనివ్వాలి కానీ, కేవలం పొరుగు దేశాల అరువు కొలువుల కోసమే అన్నట్లు ఉండరాదు. తీర్పులో ప్రస్తావించిన గాంధీ మహాత్ముని మాటలలో "తల్లి భాష కాని పర భాషలో విద్య నేర్పటం దేశద్రోహం" అన్నది ఇవ్వాల్టి ప్రభుత్వాలు తలంచాలి. ఈ తీర్పు వెలువరించిన తర్వాత కూడా, తల్లిదండ్రుల నుంచి వారికి ఆంగ్ల మాధ్యమం కావాలా వద్దా? అన్నట్లు ఒక ప్రశ్నావళి రూపొందించి వారి అభిప్రాయం తక్షణమే సేకరించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అధికారులని ఆదేశించింది. తీర్పును గౌరవిస్తూ ఎస్‌సిఈఆర్‌టి ని కూడా ఈ విషయం పై సంప్రదించాలి అని ప్రభుత్వం భావిస్తోంది.

నిస్సందేహంగా తల్లిదండ్రులకు తమ పిల్లల్ని ఎలా చదివించాలో ఎంచుకునే హక్కు ఉన్నది. కానీ, పిల్లవాని ప్రపంచం ఎలా ఉంటుంది? పిల్లల వికాసంపై మాతృభాష ఎలాంటి ప్రభావాన్ని చూపిస్తుంది?దేశంతో, దేశప్రజలతో ఉత్తరోత్తరా వారి అనుభూతి, అనుబంధం ఎలా ఉండబోతున్నాయి?లాంటి ప్రశ్నల్ని సాంఘికంగా, చారిత్రాత్మకంగా, రాజ్యాంగపరంగా, బోధనాపరంగా ఆఖరికి విద్యావిజ్ఞాన లక్ష్యాలపరంగా చూసినా, మాతృభాషే మేలు అన్న అంశాన్ని, ఇపుడు ఎస్‌సిఈఆర్‌టి, వైజ్ఞానిక, మేధో సంస్థగా చెప్పాలి. అనర్గళ ఆంగ్లం రావాలంటే మాధ్యమ మార్పు కాకుండా ఏం చేయాలనే ప్రశ్నకు, ఆంగ్లేతర దేశాలు అవలంబించే వ్యవస్థలపై దృష్టి పెట్టవొచ్చు. ఆంగ్ల భాష వాక్పటిమ కోసం ఒక విస్తృతమైన ప్రణాళికతో, ప్రాథమిక స్థాయి నుంచీ, ప్రత్యేకించి భాషను నేర్పించే నిపుణులైన, టిఈఎఫ్ఎల్ (TEFL) వంటి నైపుణ్య సామర్ధ్యతను ధ్రువపరిచే పరీక్షలతో, ఉపాధ్యాయుల్ని ఎంపిక చేసి, వారి పాఠాలను ఒక పాఠ్యాంశంగా ప్రతీ తరగతిలోను పెట్టుకోవచ్చు. ప్రైవేట్ పాఠశాలల్లో కంటే ప్రతిభావంతులైన అధ్యాపకులుండే ప్రభుత్వ బడులలో ప్రమాణాలు తగ్గటం గురించి, విద్యార్థుల్లో అభ్యాస ఫలితాల్ని దెబ్బతీస్తున్న విధాన లోపాలు వంటి వాటిని పరిశీలించవచ్చు. ఇవన్నీ పక్కకు పెట్టి, ఈ నిర్బంధ ఆంగ్ల మాధ్యమ విన్యాసం వల్ల, పిల్లల్లో అవగాహన, భావ వ్యక్తీకరణ నైపుణ్యాలలో లోపాలు మరింతగా పెచ్చుమీరి, చివరకు నేర్చుకునే దారిద్ర్యానికి (learning poverty) దారితీయవొచ్చు. అందువల్ల ఈ మాధ్యమ నిర్ణయంలో మంది బలం, రాజకీయ ప్రయోజనాలు లాంటివి చూడకుండా, భావి తరాలకు దిశానిర్దేశం చేయాలి.

సామాజిక రుగ్మతలు, అపోహలు ఉన్న సమయంలో రాజకీయ ప్రయోజనాలు, వర్గ భేదాలు మరియు సంఖ్యా బలాల్ని పక్కన పెట్టి ప్రజా శ్రేయస్సే గీటురాయిగా ప్రభుత్వాలు తమ విధానాల్ని రూపొందించాలి. ఆంగ్లేయుల పాలనలో సతి దురాచార నిర్మూలనా చట్టం నుంచి నిన్నటి ముమ్మారు తలాఖ్, ఇవాల్టి లాక్డౌన్ దాకా ఆయా పరిస్థితులలో ఉన్న ప్రజల

అపోహల్ని పక్కకు పెట్టి మరీ, ప్రజా ప్రయోజనమే పరమావధిగా భావించి ప్రభుత్వాలు చట్టాల్ని చేశాయి. ఆ కోవలోనే ఎస్‌సిఈఆర్‌టి తన శాస్త్రీయ అభిప్రాయాన్ని, సలహాను నిష్కర్షగా ప్రభుత్వానికి తెలియజెప్పే వంతు వచ్చింది. అరిస్టాటల్ విషం తాగినా, హరిశ్చంద్రుడు సంపదలన్నీ వదులుకున్నా అవి సత్యం కోసమే. మేధావుల్ని, వాళ్ళ హోదా, స్థాయిని బట్టి కాక, వారి లోకోపకారాన్ని బట్టి ప్రజలు గుర్తుంచుకుంటారు. రఘుపతి వెంకటరత్నం నాయుడు, వీరశలింగం పంతులు గారు లాంటి వారు, ఇంచేతనే మనకు ఇంకా గుర్తున్నారు. విజ్ఞానవేత్తలు, విద్యావేత్తలు సమయం వచ్చినపుడు మౌనాన్ని, నిర్వేదాన్ని ఆశ్రయించకూడదు. అలా చేస్తే సమాజ భవిష్యత్తుకు అపచారం, పాపం, శాపం కూడా.